ఆ. అర్ధమందు నీడ యంటునన్నైన్నని
యాత్మనాధుల వగపు లంటుకొనవొ,
యట్టివానితోడ నెట్టు సెప్పుదు నత్త?
మనసు వెక్కులయిన మానెఁగాని! ౧౩౭

(రాయవగ్గఁపు. ౩ ర)

ఆ. పక్షికగృహిణి వంగి నైచునప్పుడు జాతి
పడిన చేతికడెము నడుమ నిలిచి
యున్న యన్నపిండమురులు పన్నినదంచుఁ
గాకి యనిగొ చూడు! తాఁకవెఱచు. ౧౩౮

(భోజయుఁపు. ౩-౫)

క. గడువు సమీపించినఁ ఒని
చెడునోయని వెఱచి మిగులఁ జెలికత్తియ లి
ప్పుడు గోడమీఁది గీఁతలు *
తుడిచెద రొకరెండుమూఁడు దొంగతికముగ

(షష్ఠభోజయుఁపు. ౩-౬)

---

* ప్రియుఁడూరు విడిచి యున్నదినములెన్నని గుర్తుకొఱకు
గోడమీఁద వ్రాసికొన్న గీఁతలు.

ఆ. నీదు మోముతోడ నింకుపున్నమనాఁటి
చందురుండు పోలఁ జాలఁడనుచు,
వేయి తెఱఁగు గూర్పఁగోరి పోలె, విధాత
వాని ద్రుంచుచున్నవాఁడు; చెలియ! ౧౪౦

(రాహాహత్థి. ౩—౮)

సీ. తళుకు వెడవెడ చూపులఁ బొలుచుచుండు
కలికి నెమ్మోము మఱునాఁడు గాంచినపుడు
గలుగునంతటి సౌఖ్యంబు గాదు మదికిఁ
దలఁపఁ దొలునాఁటి వలపుల చెలిమిఁగూడ.

(భానుసప్తి. ౩—౯)

క. ఎదురుపడి, ముందునకుఁ జని,
పదపడి వెనుదిరిగి, ప్రియుఁడు పఱపిన మోహా
స్మదదృష్టులె మాపాలికి
మదనశరము; లెవ్వరెట్లు మదిని దలఁచినన్. *

(వాహావరాయఁడు. ౩—౧౦)

---

* 'మన్మథ బాణములనఁగా నెట్టివి?' అని యెవతెయో మగువ ప్రశ్నింపఁగా నొక ప్రౌఢ యిచ్చిన ప్రత్యుత్తరము యిది. చూ. వ్యా.

ఆ. చందురుండు మోముసాటియా; నంపలి
మోవితీయ మమృతమునకు సాటి;
కురులువట్టి తమిని గొసరి కైకొనియెడు
సకియముద్దు కేమిసాటి? చెప్పుము. ౧౪౩

(వాహావరాయుఁడు. ౩-౧౩)

ఆ. కోరినట్టికోర్కి కూడివచ్చినవేళ
గుణము దోషమెంచుకొనుచు నందు
ఊఱక తడవు చూచుచుండెడు మనుజుండు
కడకుఁ జెఱుచుకొనును గార్యమెల్ల ౧౪౪

(మాణయిందుఁడు. ౩-౧౪)

క. తీపు సుమీ నీకన్నను
నా ప్రాణమె నాకు; నిను వినా నిలువంగా
నోపదది; కాన బాలక!
కోపము వలదంచు వేడికొనియెద నిన్నున్!

(హాలుఁడు. ౩-౧౫)

ఆ. ఎట్టిచోటఁగాని యెట్టివేళను గాని
కినుక గలిగినప్పుడు, గోడమీఁది
బొమ్మవోలె, పెడమొగమ్ము పెట్టని వాని
చెలిమి చేయవలయుఁ జేసికొన్న. ౧౪౬

(పాలితుఁడు. ౩-౧౬)

ఆ. నాతి మొదటితూరి సవతిపొంతఁ బొందరింట
నడత చెడుటఁజూచి, కినుకఁగలంగి
పోలెఁ, బులుగు తెగిన పోవుచో నవిగో! హా!
హా! యటంచు నెక్కిళ్లొచ్చె యఱచు! ౧౪౭

(అర్ధరాయఁడు ౩—౧౮)

క. చిన్నవాఁడ! నిజము చెప్పెద వినుము; వ
సంతమాసమున కసాధ్యమేది?
మూరుకొనియు నెఱ్ఱగోరంట లింపైన
దారి తప్పలేదు దాని నడత! ౧౪౮

(దేవరాయఁడు ౩-౧౯)

ఆ. సకియ యింటితడిక సందులలో నెల్ల
బెళుకుఁగనులు వరుసఁబెట్టి కనుచు,
నీవు త్రోవఁబట్టి పోవఁ, బంజరమందు
పక్షివోలెఁ, గానవచ్చె నప్పుడు. ౧౪౯

(అరికేసరి. ౩—౨౦)

ఆ. ఇంటి తడికమీఁద నెదమోపి, వివశవు
తనువు బొటనవ్రేళ్లకొనల నిలిపి,
వనిత యెంతచూచినను నీవు గానరా
వేని యేమిచేయు నింకఁ జెప్పుము? ౧౫౦

(బంహూమారి. ౩—౨౧)

ఆ. దయితుఁ దలఁచి వెల్లియయి పొంగి పొరలెడు
బాష్పధార జాఱిపడునొ యనుచు
నెఱచి గొంతు మూలఁచి తెరువరి యిల్లాలు
దివ్వె దెచ్చియిచ్చు తెఱఁగు గంటె! ౧౫౧

(బంహాయారి. ౩—౨౨)

క. ఘుబువలు దలఁపదు; సాదులు
వలసదు; వాకెప్పుడు నడిమివారలె మే; లా
ఘులువలను జూచినను, సా
దులఁ జూడకయున్న, నొక్క దుఃఖమొకలుగదే

(హాలుఁడు. ౩—౨౮)

తే. కలికి! సాజంబుగా నిండుఁగనుల వానిఁ
జూచెదవుగాని క్రీఁగంటఁ జూడకమ్మ!
అతనిఁ జక్కఁగఁ జూచిన యట్టులగును;
నీవునొక ముగ్ధవనుచు మన్నింత్రు జనులు. ౧౫౩

(మయూరందుఁడు. ౩—౨౫)

తే. అలుకతోఁ బగలంతయుఁ బలుకకుంటి
పనుల ముగియించి నాతప్పువలని శోక
మెంతయున్నను నాకాళ్ళచెంత చేయి
చెలియ శయనించు తెఱఁగును దలఁతునిపుడు.

(విచ్ఛముఁడు ౩—౨౬)

ఆ. సొగసుకాఁడ! నీమనంగువ సుశీలవై
మేము చెప్పినటు కేమి హేతు
వనెదవో! వచింతునా మరి? నీవంటి
పరువమైన మగఁడు పొందరాఁడు. ౧౫౫

(ఉణాలచ్చీ. 3-౨౮)

ఆ. ఆతఁడూరు గాలినప్పుడు నాచేఁజేత
మగువ! నీటికడవ మార్చుకొనఁగ,
ఇంటిలోని యాస్తియెల్లఁ గాలినఁగాని
మదికి సంతసంబె యొసఁగెఁ గదవె! ౧౫౬

(శేషప్పలుఁడు. 3-౨౯)

తే. ఆకులును గొమ్మలును లేక యడవి నడుమఁ
బొట్టిమోడుగ నెందైనఁ బుట్టవచ్చుఁ;
గాని, నరలోకమునఁ జెట్టుఁ గానులేక,
రసికుఁడై, దాతయై, పుట్టరాదు చూవె! ౧౫౭

(అనమనాహుఁడు. 3-30)

క. చనిరా చెలికత్తియ; లా
యనువగు పొదరింట్ల మోడుతై మిగిలెను; మా
కును గడచె వయసు; వేళులు
తునిఁగి తెగెనుఁ బ్రేమ; దానితోనే మింకన్?

(నిజవముఁడు. 3-3౨)

క. ఎడఁబాయుట విషమై యే
ర్పడు; డెంగటనున్న సమ్మృతరసమై సుఖమంత
కడుఁగూర్చు; బ్రహ్మ రెండుఁ గ
దా డఁగి సరిఁగఁగలిపి చేసెనో యీచెలియన్?

(హాలుఁడు. ౩-౩౯)

ఆ. ఒకరినొకరు చూడకుండిన వేయూజి
నిలిచియుండు గట్టివలపులైన,
కొడుక! కాలమేగుకొలఁది, దోసిటిలోని
నిరువోలె, మెల్ల జాఱిపోవు. ౧౬౦

(వహూరసుఁడు. ౬—౬౬)

ఆ. 'అమ్మ తేలుగుట్టె'నని చేతులను విచు
చిన్నదానిఁబట్టి చెలులు జాణ
లదిగో! మగనికనుల యెదుటనే కొంచుఁ బో
యెదరు జారవైద్యు నిల్లు సేర! ౧౬౧

(మల్లసేణుఁడు. ౩—౬౭)

ఆ. దొరకకుండ వేఁడు దొరకిన చెంగావి
చీరగట్టి కాఁపువారి కోడ
లదిగో! చిన్నదయ్యు నడఁగక తిరిగెడు
విరివియైన యూరి వీధులందు! ౧౬౨

(మవుహాఁడు. ౩—౪౧)

క. దొరకు స్వతంత్ర్యము, క్రియ సుం
దరి కలుక, సమర్థపురుషునకు శాంతగుణం,
బెఱిఁగిన వానికిఁ బలుకుట,
యెఱుఁగని మొఱకునకు మౌనమే, శోభించున్

(సుందరుఁడు. 3—౪౩)

తే. వడఁకి చెమరించు వ్రేళ్ళకు వసముగాక
నిలిచినడవక జాఱు నీకలము తోడ
స్వస్తి శబ్దమె ముగియింపఁ జాలనైతి!
కమ్మనింకేమి వ్రాయంగఁగలను! చెలియ! ౧౬౪

(అంధుఁడు. 3—౪౪)

ఆ. ఐనదియును నష్టమై పోవు నరులకు
దైవకరుణ కొంత తప్పనేని;
ఏమిపనికిఁ దొడఁగిరేనియు మూలమే
కూడి కుదుర దిసుకగోడ వోలె. ౧౬౫

(అంధుఁడు. 3—౪౫)

ఆ. అత్త! నేను దానమాడుచునుండ నా
నీటుకాఁడు వచ్చి యేటిదిగువ,
పసపుచేదు నీరు పట్టి త్రావుచును నా
యుల్లమెల్లఁ గ్రోలె నొక్కమాఱు. ౧౬౬

(వోలపవుఁడు? 3—౪౬)

ఆ. చనిన యౌవనంబు వెనుకకు రాదు; జీ
వంబు కూడ శాశ్వతంబె కాదు;
ఒక్కనాఁడువోలె నొక్కనాఁడుండదు;
జనులకింత కటికతనము లేల? ౧౬౭

(హాలుఁడు. ౩-౪౭)

ఆ. పుడమిఁ జెష్టవారు గడియించు నాస్తికిఁ
బాత్రులెవ్వ రిట్టివారె కాక?
వేఁపమ్రానఁ బండ్లు వెలసినఁ గాకులే
వచ్చి వానిఁదినఁగ వలయుఁ గాదె? ౧౬౮

(పాలితుఁడు. ౩-౪౮)

ఆ. ఇలను సుజనులొరుల కలుగనే యలుగరు;
అలిగిరేని చెడుగు దలఁప రాత్మ;
తలఁచిరేని వెలికిఁ బలుకఁబో; రొకవేళఁ
బలికిరేని సిగ్గుపడుదు రెపుడు. ౧౬౯

(అర్జునుఁడు. ౩-౫౦)

తే. వలసినప్పుడు చేతిలోఁగలదె ధనము;
వ్యసనములఁ జెంత విడువనివాఁడె సఖుఁడు;
అమలగుణములు లోఁగొన్నయదియ రూపు;
వినయధర్మంబు వీడనియదియె తెలివి. ౧౭౦

(హాలుఁడు. ౩-౫౧)

క. కనుపాపల సరమూయుచుఁ
గొనగన్నులఁ జూచుచుండు కోడలి తెఱఁగుం
గని, యజమానుఁడు వలద
న్నను, తెరువరి మందిరాంగణమునను విడిసెన్.

(సుందయ్యుఁడు. 3-౫౮)

క. పెనుగొండను బోలిన మను
జునినైనను రెండుపనులు చుల్కఁపఱుచుఁ; జే
యనిపని చెప్పుకొనుట, చే
సిన కార్యము నొరులతోడఁ జెప్పుకొనుటయున్.

(గోవిందస్వామి. 3-౫౫)

ఆ. తడిక సందులందు వెడలు నాకులతోడఁ
దరుణతతికి నాముదంపుఁ జెట్టు,
'ఇచటఁగాపుకోడలింతింతలేసి పా
లిండ్లదున్న'దని వచించుఁ బోలె. ౧౬౩

(ఉద్ధవుఁడు. 3-౫౬)

ఆ. ఎండు మఱ్ఱిమ్రాని యండకుఁజేరి చ
ప్పట్లు చఱచి నగిరి పాంథులప్పుడు,
తమ్ముఁజూచి బెదరి దానియాకుల పంక్తి
పగిదినున్న చిలుక లెగిరిపోవ. ౧౬౪

(అణులచ్ఛి. 3-౬౩)

క. తెలివియు గుణములుఁగల ని
ర్మల చరితులతోడి పగయు మంచిది; జన నిం
దలపాలగు నల్పులతోఁ
జెలిమి పొసంగినను మాకు సిగ్గుపోదమొదల్.

(నవరసత్తి? 3-౬౭)

ఆ. తరుణి! నీ మొగంబు దాఁకెడు సూర్యుని
జెఱఁగుపెట్టి యడ్డసేయవలదు;
తామరయును నీదు మోమును దాఁకి యిం
దేని సుఖము వాని నెఱుఁగ నిమ్మ! ౧౭౬

(శీలుఁడు. 3-౬౯)

ఆ. ఏమి చెప్పనెత్తి నింతి చెల్వను? చూపు
దాని మేన నెందుఁదగులుకొన్న
వెడలిరాదు మరల, నడవఁజాలని పెద
గోవు బురదఁ జిక్కుకొన్నయట్లు! ౧౭౭

(పన్నాయ కుమారుఁడు. 3-౭౧)

ఆ. నీటిమీఁదివ్రాఁత నిజము దుర్జనమైత్రి,
చేయుచుండఁగనె నశించుచుండు,
అనిశము సజ్జనాళియందుఁ జల్పితమని
ఱాతిఁ జెక్కినట్టి వ్రాఁత గాదె? ౧౭౮

(సరలుఁడు. 3-౭౨)

ఆ. మరల నింతలోన తరలిపోవఁగ నీకు
నెటులు పుట్టె మనసు? కటికవాఁడ!
తెరలు తెరలుగాఁగఁ దిరిగి నవివె చూడు
కురులు, నేఁడుగూడఁ గుదురుకొనవు! ౧౭౯

(సరలుఁడు. 3—23)

ఆ. మేను వేఁడుకొనిన మీఁద నల్కయొకింత
చల్లఁబడియెఁగాని, చాల సేపు
నీదు తప్పులను గణించుచు నిరుగేల
వ్రేళ్ళు సాలకుండ వెలఁది యేడ్చె. ౧౮౦

(విఠ్ఠలుఁడు. 3—22)

ఆ. పతడుమాట యుండనిండది దైవంబు
చేఁత; దానికేమి చేయఁగలము?
ఇంత చెప్ప నేర్తు; మెందు నశోకంపుఁ
జివురువంటి చివురు భువిని లేదు. ౧౮౧

(జీవయేవుఁడు. 3—29)

క. అనవరత బాష్పధారలు
కనుఁగడవలఁ దొరఁగు చుండఁగా నదిగో మా
నిని, చెక్కలఁదోఁచిన చం
ద్రునిమచ్చను గడుగురీతిఁ దోఁచెడుఁ గంటే!

(వినమరాయఁడు. 3—౮౦)

ఆ. వేఱుపూలసరులు వేయింటిలో విరి
బోజియున్న దాని సౌరభంబు
పోదు సుమ్ము; పాఱపూపిది; దీని నె
త్తావి గుబులుకొను విధంబె వేఱు! ౧౭౩

(వియహారుఁడు. ౩-౮౧)

ఆ. మానవంతుఁడైన వాని మనం బెంత్య
కశలఁగూడ నున్నతంబె యగును;
మునిఁగి పోవువేళలను సూర్యకిరణముల్
మీఁది కెక్కఁగాదె మెఱయుచుండు! ౧౭౪

(మాపురాయఁడు. ౩-౮౪)

ఆ. తెలిసి చని తేమంతఁదిని త్రాఁగవలసిన
ఎడవిగడ్డి మఱియు నడవినీరు;
అట్టులయ్యు వలపు లామరణాంతము
లేళ్ళ కిట్టులకుఁ జలింప వపుర! ౧౭౫

(అవణాయరుఁడు. ౩-౮౭)

ఆ. చదురు నడతలేక సత్యంబు నెఱిఁగిన
వారి లోఁగొనంగ వసముగాదు;
కడుగుసిరు ముందుగడఁ బెట్టి పాలంచుఁ
బాఁతిపిల్లి బెలుపఱుపఁగలమె? ౧౭౬

(భోజయుఁడు. ౩-౮౬)

౫. అనుసయ సుఖమువలచి, చే
యనిపనియును జేసినట్టిలాడి, యకట! కా
మిని, సరళ హృదయుఁడైనను
తనదయితుని దాని తప్పుదారికి నీడ్చెన్. ౧౯౫

(సీహుఁడు. ౪–౬)

౬. కడచె నిన్నినాళ్ళుఁ గాలుసేతుల వ్రేళ్ళ
నొక్కటొకటి గాఁగ లెక్కపెట్టి;
'ఇంకమీఁద దినములేమిట లెక్కింతు?'
ననుచు నేడ్చుచున్నదకట! ముసద. ౧౯౬

(పాలితుఁడు. ౪–౭)

౭. చిలుకముక్కువన్నెచే నొప్పు మోదుగు
పూలపఱపు పోలిచె నేలనెల్ల,
బుద్ధదేవు చరణములు మ్రొక్కఁ బుడమిపై
వ్రాలియుండు భిక్షుజాలమట్లు. ౧౯౭

(సూరణుఁడు. ౪–౮)

౮. పడఁతి! నీదుమేన బటువుతో సంగంబు
లెల్ల నిట్లు సన్నగిల్లె; సన్న
మైనవెల్లఁ బోచలై తోఁచె; నింక నీ
పాడుకోపమిట్లు పట్టనేల? ౧౯౮

(కులపుత్త్రుఁడు. ౪–౯)

ఆ. తనకు నాపుకైన దాని మెత్తురు గాని
గుణము చూచి మెచ్చుకొనరు జనులు;
ముత్తియములు వదలి మోజుతో గురివింద
తెరుకొనరె చెంచువార లడవి? ౧౯౯

(సమరిణాసుఁడు. ౪-౧౦)

క. నడఁకుచును గంధవాడి తన
పడికిటఁ గొని ప్రియునిమీఁద వెదఁజల్లఁగఁ బో
యెడు మొగుడకుఁ జెమ్మట న
వ్వడ కలపంబయ్యె హస్తమున నదియెల్లన్.

(కాంతకరుఁడు? ౪-౧౧)

తే మగువ! పెరటింటి యూడుగుమాని యాకు
పీకనకు నంటుకొనియె; దుల్పికొనవమ్మ!
?గాలగు తోడికోడండ్రు సైచియుండ
బెట్టక, నీవేమి పాపము నెఱుఁగకున్న. ౨౦౧

(పంకి. ౪-౧౩)

తే. రెండుపోలెఁ గన్నులు రెండు వానిఁ
గాంచినప్పుడు మూసికోఁగలను గాని;
చెలియ! మేనెల్ల గనిమి పూఁచిన విధాన
నప్పటికెపు పలకలఁ గప్పుకొల్లు? ౨౦౨

(నస్సీహాలుఁడు. ౪-౧౪)

తే. పూరిక ప్రోవుగాలికిఁ బోవ నింటి
నేల గతిలేక యొడ్చుచుఁ గూలఁబడిన
వలసపోయిన యాతని చెలిని, చూడు!
మెఱపులవె చూపెడినిబోలె మేఘములకు.

(రాయహార్థి. ౮–౧౫)

ఆ. ఏదిదొరకె నది భుజింపుము; లవణంబు
పల్లెటూర నెట్లువచ్చు మాకు;
చెలువుకాఁడ; వినుము; స్నేహంబు లేదేని
లవణమెంతయున్న లాభమేమి? * ౨౦౮

(తిలోయణుఁడు. ౮-౧౬)

తే. సుఖము నడుగుచు నాయింతి ముఖసరోజ
సురభి నిశ్వాసములఁ జల్లఁబఱిచి యీయఁ
ద్రాఁగె నొకమాఱె యాకాఁపురోగి, చూడు!
వెగటుమందును జుక్కయు మిగులనీక. ౨౦౯

(తిలోయణుఁడు. ౮–౧౭)

---

* లవణము=ఉప్పు; లావణ్యము. స్నేహంబు=నేయి; వలపు.

ఆ. ఎంత యలుకగొన్న నేమి? సత్పురుషుల
నోటనెన్నఁ జెడ్డమాట వెడలు?
రాహువదన గహ్వరమున నున్నను జంద్రు
కరము లమృతరసమె కురియుఁగాదె; ౨౦౬

(అవంతివర్మ. ౪-౧౯)

కం. ఇతరులు దనుమన్నించినఁ
బ్రతిసేయఁగలేక దుఃఖపడినట్టులు, దు
ర్మతి యవమానము సేసిన
వెతనొందఁడు సజ్జనుండు, వేదఱికమునన్. ౨౦౭

(అవంతివర్మ. ౪-౨౦)

ఆ. కలహములను గూడ వెలికిరా, వాత్మలో
నణఁగి పోవు, సాధు జనులు విన్న
మఱుఁగుమాట; లొక్క మాఱుగ నాయువు
గడచినప్పు డగ్గిఁ గాలుఁగాని. ౨౦౮

(హేలుఁడు. ౪-౨౧)

తే. పూలగుత్తులతో జాజిపొదలు పెఱిఁగి
యంగణమునందు వాకిండ్ల కడ్డమయ్యె;
దాఁటఁజూచుచు నుండు నోదార్పుగూడ
నీడఁ జిక్కిపోని యతివల కుండనట్లు! ౨౦౯

(వత్సుఁడు. ౪-౨౨)

ఆ. అతివ ప్రియుని జూచినప్పుడు సుఖమున
మునిఁగి కన్నుదోయి మూయదేని,
దాని చెవులమీఁదఁదవిలి వ్రేలెడు నల్ల
కలువపూవు లెవఁడు గాంచఁగోరు? ౨౧౦

(వసంతసేనుఁడు. ౪—౨౩)

ఆ. అనుసునందుఁ జిక్కువడిన నాగలి యీడ్చి
మగఁడు సొలసి నిద్రఁదగిలి యుండఁ,
జిత్తమందు వలపు రిత్తవోవఁగ వాన
కాలమును శపించుఁ గాఁపుఁ బడఁతి! ౨౧౧

(చుల్లోహలుఁడు. ౪-౨౪)

ఆ. పూలమయములయ్యెఁ జాలగట్టివి; మేను
దాఁకకున్న నుడుకు తాళరాని;
వాడలు చీల్చుచున్నఁగడుఁ దీపుగల వార!
మరునియమ్ము లొక్క తెఱఁగు గావు! ౨౧౨

(హాలుఁడు. ౪-౨౬)

క. వలపుల రేఁచు; వియోగ
మ్ములఁ జావఁగ సీయు; వీసుఁబుట్టించును; త
ప్పుల నెల్లను మఱపించును;
పలుత్రోవలు సుమ్ము చెలియ! వానిగుణంబుల్.

(మాహవసేనుఁడు. ౪—౨౭)

ఆ. కటికవాఁడ! నిన్నఁగనఁగోరి, చెంగావి
వలువముసుఁగువైచి, వాయనములఁ
బళ్ళెరములనించి పాప మిల్లిల్లును
దిరుగ వెడలిపోయెఁ దరుణి యిప్పుడు. ౨౧౪

(ధనంజయుఁడు. ౪ – ౨౮)

తే. పొగచగిలి మాసి చిదుకనిప్పుకలకంపు
చెంది పోగులు సడలిన చిరుగు గుడ్డ
గప్పుకొనియుండ నీచలికాలమందు
పేదవాఁడని తెలియంగరాదె వాని? ౨౧౫

(అణ్ణాయుఁడు. ౪ – ౨౯)

తే. నేర్పుకాఁడవు; సూర్యుని నెపము పెట్టి
యెవ్వరికి మ్రొక్కెదవు వచియింపు కొడుక?
చిఱుతనగవులు క్రేఁగంటి కఱకుఁజూపు
లెక్కడను రావు వేల్పుల మ్రొక్కునప్పుడు.

(విగ్రహారాయుఁడు. ౪ – ౩౨)

క. బుగులుకొను శోకభరమున
బిగిసినకంఠమున సగము వెడలుచుఁ బలుకుల్
తెగిపడఁగఁ బాట నెపమున
పసుగువా! యేడ్చెదవు తెల్పుమా యెవ్వనికై?

(అహాయుఁడు. ౪ – ౩౪)

ఆ. కనులు కానరాని కటికచీకటి రేయి;
వలసపోయె మగఁడు; వట్టియిల్లు;
దొంగలెవ్వరైన దోతురుసుమ్మ; ని
ద్రింపవలదు పక్కయింటి వాఁడ! ౨౧౮

(అహాయుఁడు ౪—౩౫)

ఆ. క్రొత్తమొగిలు చూచి కోడలిప్రాణముల్
కదలుచుండఁ దానిఁగాచుచున్న
దితరచింత విడిచి, సుతుపాలి సంజీవ
నౌషధమ్మువోలె, నత్తగారు. ౨౧౯

(విహాలుఁడు. ౪—౩౭)

ఆ. నీవు కానరాక పోవుడు, బాష్పంబు
వెల్లి పొంగిపారలు వెడఁదకనుల
నీళ్ళువదలె నతివ నిన్ను వెండియుఁజూచు
నన్నిసౌఖ్యములకు నందకాఁడ! ౨౨౦

(మణోరహాఁడు. ౪—౩౮)

ఆ. చనవుగల్గు తొంటి జనులందఱును జచ్చి
పోయియుండు జన్మభూమిఁబోలె,
నాఁటిరూప యౌవనములు పోయిన నిన్నుఁ
గాంచి యెట్టులోర్వఁగలను బిడ్డ? ౨౨౧

(పవరరాయఁడు. ౪—౪౦)

ఆ. జనులనడుమ వాఁడు సంతసంబున విచ్చు
కొనినకనులఁ దనదుకోర్కి తెలిపె;
అప్పుడు నిలువుఁడెమాటలైన యంగంబుల
నింతి గూడ దానికియ్యకొనియె. ౨౨౨

(జీఅపవ్వుఁడు. ౪-౪౧)

ఆ. వానిమీఁద నీకు వలపులేదేనియు
చెప్పుము! వానిపేరు చెప్పినంత
ముద్దుగుమ్మ! నీదు మోమింత కానేల?
ప్రొద్దుపొడుపు తమ్మి పూవుఁబోలె. ౨౨౩

(సుసీలుఁడు. ౪-౪౩)

తే. అలుకమార్నికి పెనుగాలి, యంగమెల్ల
సుఖమునించెడు నెఱదాత, సురతనాట
కంబునకుఁ బూర్వరంగము, కౌఁగిలింత
చల్లగా నత్తె జగతి వర్ధిల్లవలయు! ౨౨౪

(౪-౪౪)

క. చిన్నవాఁడ! నీవు కన్నులయెదుటనే
యుండ దినదినంబు నెండుచుండు
నిట్టియొడలుగగ్గి, యెవరికి నడిగిన
నేమిచెప్పవలెనో యెఱుఁగ లేము! ౨౨౫

(మాణిక్యరాయుఁడు. ౪-౪౬)

ఆ. చేరి మేమె నిన్ను చెడిపెలముందఱ
మొదలు పొగడిపొగడి తుదకు నీవు
చేతఁ జిక్కకుండఁ జేసికొంటిమిగాని
యెవరి నాడుకొనఁగ నేలయిందు? ౧౧౬

(సంకరసత్తి. ౪—౫౦)

ఆ. పువులు గోసి తేరఁబోకు; దోసిటినీళ్ళ
దేవతలకుఁ దనివి తీఱుఁ గొడుక!
మదిని నిల్పుమొక్కమాట; గోదావరి
గట్టులెపుడు నడతఁ గత్తిరించు! ౧౧౭

(ణందణుఁడు. ౪—౫౫)

ఆ. చొక్కకనులు మూయు సుదతిఁ జచ్చెనటంచు
విడిచి పాఱుకాపు వెడఁగుఁ జూచి,
పత్తికొమ్మ నగముపగిలిన కాయల
మొగమువంచి చేల నగియెఁబోలె. ౧౧౮

(జ్ఞానందసారుఁడు. ౪—౬౦)

ఆ. పుణ్యవతులు వడఁకి పులకించి నిట్టూర్పు
లూర్చి నాట్యమాడుచుండఁగలరు;
మగనిఁజూచినపుడు మావంటివారికి
నోడలఁ దెలివిమైన నుండదమ్మ! ౧౧౯

(రోలపవుఁడు. ౪-౬౧)

ఆ. కానివారిసిరిని గాంచుట, వైద్యుండు
లేని తెవులు, విభవహీనులగుచు
బంధుమధ్యమందు బ్రదుకుట, వలె, నీ వి
యోగదుఃఖ మెట్టులోర్తుదీని? ౨౩౦

(వామయేవుఁడు. ౪-౬౩)

తే. ఇంటిపెద్దల యెదురఁ దానెంతమనసు
నడఁచుకొని యుండినను, నీవు వెడలినపుడు
కనులు మూయుటచే తెప్పకొనలనున్న
దానికన్నీరు తటుకున ధరణిఁబడియె. ౨౩౧

(వాహవుఁడు. ౪-౬౭)

తే. మందబుద్ధివి, పెద్దలముందు నాఁడు
తెప్పవేయక నీవంక రెడ్డికూఁతు
రించుకించుక మొగము మలంచిచూచు
చికిలి క్రీఁగంటి చూపులఁ జెప్పలేదె? ౨౩౨

(వహురాహుఁడు. ౪-౭౦)

ఆ. ఎవనితోడనించు కెడఁబాటుగల్గిన
దేహమెల్లఁ జిక్కి తెల్లఁబాఱు,
నిదుర నిలిచిపోవు, నిడుదలౌ నూర్పులు
నతనితోడ నేటియలుక చెలియ! ౨౩౩

(హాలుఁడు. ౪-౭౪)

తే. సొగసుకాఁడ! మనసంబున సురిగి సురిగి
నీకొఱకు నింక నేమరణింపఁబోను;
నిన్నె తలఁచుచుఁ జచ్చి వెండియును నీకె
చిక్కి వెతలను గుడిచి శోషింపనేల? ౨౩౪

(౪—౭౫)

ఆ. ఇచ్చకొలఁదిఁ దప్పులెన్నియైనను జేయు;
మన్నియోర్వనేర్తు మందకాఁడ!
నీదు సద్గుణములు నిండిన మాచిత్త
మందు దోసములకు సందులేదు. ౨౩౫

(మాపురాయఁడు. ౪ - ౭౬)

తే. తెరువరికి రాత్రిపూట నిద్రించుకొఱకుఁ
గసరి తిట్టుచు నిచ్చిన గడ్డిమోపె
యేడ్చుకొనుచును మరలఁ దానీడ్చివేయు
చున్నదిల్లాలు కనుఁగొంటె! యుదయవేళ*

(అర్థుఁడు. ౪—౭౯)

---

* మొదలం ఉపచారము చేయలేక కోపము. తరువాత ని
నుపురకును చెలిమి కుదిరినది. ప్రాతఃకాలమున అతని ప్ర
యాణముచే విరహ దుఃఖము.

ఆ. చేటులందు వెతలఁజెందరు! భయముల
గుండె చెడరు; సిరులఁ గ్రొవ్వఁగొనరు;
ఎచ్చుదగ్గులందు నేకచిత్తముతోడ
నొప్పువారు సుమ్ము గొప్పవారు. ౨౩౭

(ప్రిణాలుఁడు. ౪–౮౦)

ఆ. తనదు చెలిని తలఁచికొని నేఁటి పొద్దున
పాడుచుండె వాఁడెవండొ చెలియ!
చెఱకువిల్లు నంపకఱకులు దిన్న నా
మదిని బుండు గోటఁజిదుమునట్లు. ౨౩౮

(కేసవుఁడు. ౪–౮౧)

తే. ఎంత యాఁకలి గొనియున్న నిదిగొ చూడు!
దయితకరిణీముఖంబును దలఁచుచుండి
తినమనసురాని కుంజరమునకు వాఁడెఁ
దొండమునయందె తామరతూండ్లపిడుచ. ౨౩౯

(౪–౮౩)

ఆ, 'అలుక మానుచెలియ;' 'అలిగినదెవ్వతె?'
'పడఁతి! నీవె;' 'ఒరులపైన నాకు
నేటియలుక?' 'ఒరులిఁకెవ్వరిచ్చట?' 'నాథ!
యీవె;' 'ఎట్లు?;' 'నాయదృష్టమహిమ?'

(కువిందుఁడు. ౪–౮౪)

తే. తిన్నఁగా నాదుకొనుఁడు; భీతిల్లవలదు;
పాపమీమెను దయ్యముల్ పట్టుకొనవు!
ఉన్నదున్నట్లు మేఘంబులుఱుము, బెదరి
భ్రాంతి గొనియున్న పథికుని భార్యగాని. ౨౪౧

(దుర్ధరుఁడు. ౪-౭౬)

ఆ. 'ఎవరిఁదలఁచు చుంటివే?' యని యడిగిన
'నెవరుగలరు నాకు భువి?' నటంచు,
గోలుగోలుమనుచు గొంతెత్తియేడ్చి యా
యింతి మమ్ముఁగూడ నేడిపించె! ౨౪౨

(సురహివచ్ఛుఁడు. ౪-౭౯)

ఆ. చెడుగుదాన! కాళ్ళఁబడినాఁడు; నీపతి
నింకనైన లేవనెత్తవేల?
వలపులెంత గట్టివాఱిన వయ్యును
ఇదియె వినుము వానికెల్ల మేర. ౨౪౩

(హాలుఁడు. ౪-౯౦)

ఆ. పచ్చరాతి సూదిఁ గ్రుచ్చిన ముత్యంబు
పగిది, గరికతుదను దగులు నీటి
బొట్టుఁ ద్రాగుచుండెఁ బొడువుగ మెడసాఁచి
కంటె! నెమలి వానకాలమందు. ౨౪౪

(పాలితుఁడు. ౪-౯౪)

ఆ. మొదలు చెక్కుటద్దములదాఁక సపరంజి
కమ్మలెప్పుడుఁ దాల్చు కలికిచెవులు
దాల్పవలసె నేఁడు తాటాకుచుట్టల
జోడు; కాలమహిమ చూచినావె? ౨౮౫

[౪ - ౯౭]

తే. మండుచుండెడు వేసవియెండవేళ
మరుగుచుండెడు తెరువరికైనఁగాని,
మదిని నెలకొన్న ప్రియురాలి వదనచంద్రు
పండువెన్నెలవల్లి తాపంబునణఁచు. ౨౮౬

[మంగళకలసుఁడు. ౪ - ౯౯]

ఆ. మండెదేని మండు; మాఁడెదేనియు మాఁడు?
పగిలెదేని పగులు పాడుమనస!
వాఁడు తగినవాఁడు గాఁడని యొకమాఱు
నిర్ణయించినాను నేఁడు మొదలు. ౨౮౭

(హాలుఁడు. ౫ - ౧)

ఆ. పెడఁద మూర్తితుదను వెడలినవాఁడియా
కోలపంక్తితోడి కొడుకుఁ జూచి,
తల్లిపంది తనకునొల్లకున్నను మేయు
నారి ప్రక్కతోటనుండు యవలు!* ౨౮౮

(విగ్రహుఁడు. ౫ - ౨)

---

* ఎవరైన నదలింప వచ్చిరేని కొడుకు పౌరుషము ప్రకటింప నవకాశము లభించునను పొగరుతోడి యాశ తల్లిపందికి.

క. కలమీఁద నశోకమ! కా
వలసినదే యింతకన్న భాగ్యము నీకుఁ!
లలనారత్నంబుల చే
తులతో నీచివురు బోలుతురు గద రసికుల్.

(కర్ణిల్యుఁడు. ౫-౪)

క. కొడుకునకును దయితునకును
నడుమను గూర్చున్నవేళ నఖముఖముల రా
పిడిచే నిర్గాలికిఁ జ
న్గడవలలోఁ జేపునొక యొకతి పులకించుఁ!

(హాలుఁడు. ౫-౯)

ఆ. మరులుకొల్పు నింత చిఱుత ప్రాయమునందె;
జుత్తెఁ దైన లేదు చూడు మరల!
పెరిగెనేని రెక్కిబిడ్డ యనర్థంబు
దెచ్చు నిజము వినవుఁదీగబోల! ౨౫౧

(భోజయుఁడు. ౫-౧౦)

ఆ. బురదమొల్లనెండి పోవఁ దాఁగోళ్ళును
మీలు నెట్టఁజిక్కి మిడియుచుండ,
నేఁడు గంటిమొఱుడుఁ జూడని దీతటా
కంబులోని నేల కాలమహిమ! ౨౫౨

(౫-౧౪)

ఆ. దొంగతగులములకు లొంగి చీకటియందు
వలసినట్లు తిరుగవలదు బిడ్డ!
కానఁబడెదు తొంటికంటెను మిగులఁ జీ
కట్లయందు దీపకళికవోలె! ౨౫౩

(ఆహ్లాయంతుఁడు. ౫-౧౫)

క. అడిగిన బదులాడెదు, క
న్నపు వావలమీఁద రేగిపడు, నూఁకక యూఁ
చెడిపె గను, మేటిలోపలి
మడువు పొదలు చిచ్చుదగిలి మండుచునుండన్.

(రోలయేవుఁడు. ౫-౧౬)

తే. నిజము మేమెల్లఁ జెడితిమి; సదిమచ్చ
లేనికులము! పతివ్రత! లేచిపోవె!
కాని, మేమెవ్వరమును మంగలిని వలచు
పంటలముగా మొకానొక దానిఁబోలె! ౨౫౫

(పాలితుఁడు. ౫—౧౭)

క. నిద్దుర గందురు; చెప్పిన
సుద్దులు వినఁగలరు; పలుకుచోఁ దడఁబడ; రే
పొద్దు నినుఁజూచి యెఱుఁగని
ముద్దియలదిసుఖము, మదనమూర్తి! జగమునన్

(దేవయేవుఁడు. ౫-౧౮)

క. కలలో దోఁచెడు బిబ్బుల
వలెఁ, జూచినయట్టి మఱుఁగుపడి పోయెను నె
వలపులకు లోఁగి, పలుతలఁ
పులతోఁ బిస్సమ్మ! మోసపోతిమి గదవే!

(౫ ౨౮)

గీ. ప్రియులు గాఁగిలించు వేళలఁ జనులపై
రత్నహారములను రమణులూఁత్తు;
రెంత సుగుణవంతులేనియు నవమాన
మొందరొక్కొ- కాల మొదవినపుడు! ౨౫౯

(౫- ౨౯)

ఆ. వేఱు తెఱఁగు చూడవే లాఁతి చిచ్చుల
వలెను గాదు పాడువలపుఁ జిచ్చు!
నీరసంపుటెదల నాఱి పోవుచునుండు;
మండుచుండు సరసమానసముల! ౧౫౯

(౫-౩౦)

తే. మన్ననల నట్లు పెరిగిన; దన్నినాళ్ళు
చెలిమిచే వేఱుబలిసి నిల్చినది; చూడు,
ప్రేమ వృక్షంబు; పడిపోవువేళ నింత
చప్పుడైనను లేదేమిచెప్ప నత్తె! ౨౬౦

(పాలుఁడు. ౫–౩౧)

ఆ. తీపుమాటలాడఁ దెగి చేదులాడితి;
వెఱఁడు కాల్పఁబడిన నరయువైతి;
వలిసిపోవ నాఁపనైతివి! పొలయల్క-
నెవరికోడకుఁ బూనితింకఁ దెలియ! ౨౬౧

(గీ-౩౨)

ఆ. తుషంపు నొక్కమాఱు, కడుగు నింకొకమాఱు,
కొసరి యొక్కమాఱు కోటఁజిమ్మ;
ముగుద యెఱుఁగలేదు, మగఁడు చన్దోయిపై
నాఁటియున్న గోటికాటుఁగంటె! ౨౬౨

(గీ-33)

ఆ. దానసంబువలె సుదారపయోధర
ఠీలఁ బొలుచు వానకాలమరుగ,
మొదటి తెల్లఁబూవు మొలచెను, భూదేవి
తలమునందుఁ గురుల నరపువోలె. ౨౬౩

(గీ 3౪)

క. ఉసుగని జలధారలనెడు
నిసుదాత్రులఁ గట్టి యీడ్చి నిక్కయు బలిమిన్
బసదనిఁ బయికెత్తలేకా
వ్యసనగతి సుఱమెడిని గంటనే మొగిలు దివిన్!

(గీ-౩౬)

ఆ. ప్రియుఁడు గడువుదినముఁ జేర్కొన్న వేళలో
నొప్పుకొంటి; వున్నదున్నయట్లు
పాడుమనస! కలఁగఁబాఱెద విప్డు; న
మ్మించి నన్నుఁజెఱుప నెంచినావు! ౨౬౫

(౫-౩౮)

ఆ. నిండు జవ్వనంపు నిగ్గులుదేఱు క
పోలమూలమందుఁ బొలఁతి కదిగో!
చెవిని వ్రేలుచుండు ఫ్రువుగుత్తి వంగి లా
వణ్యరసముఁ ద్రావుపగిదిఁ దోఁచు. ౨౬౬

(౫-౩౯)

ఆ. అంగములు చెమర్ప నయ్యుందకానిఁ జే
ర్కొనుచు దూతివెంటఁ గొసరి కొసరి
చెప్పినదియె మరలఁ జెప్పుచుఁ గామిని
కడకు వానియింటికడకె వచ్చె! ౨౬౭

(౫-౪౦)

క. నను గొట్టినమ్మినన వా
నిని గొట్టెదవేని, మదన! నే మఱుజన్మం
బునఁగూడ నాదు జీవం
బును నీపాదములఁబెట్టి పూజింతుఁ జుమీ.

(౫-౪౧)

ఆ. సిగ్గులేనివాఁడ! చేసిన మేలును
మఱచువాఁడ! నీదుకొలఁకు వాన
కాలమందు రాత్రివేళఁ ద్రొక్కిన యూరి
బురద నేటికైన మఱవలేను. ౨౬౯

(౫-౪౫)

ఆ. ప్రియము మయములైన పల్కుల తెగవేఱు;
ఇచ్ఛకంపునుడుల యచ్చువేఱు;
మనసు లెఱుఁగునత్త! మఱి వానిభేదంబు;
అక్షరంబు లొక్కలైననేమి? ౨౭౦

(౫ ౫౦)

ఆ. పట్టి పెదవులందుఁ బుట్టినవీమాట;
లిట్టివెన్నియైననేమి ఫలము?
మనసునుండి వెడలు మాటల తీఱది
వేఱు; నిల్వకీఁదు వెడలిపోక! ౨౭౧

(౫-౫౧)

ఆ. అతివ! తెలియకుండ నడిగెద; ప్రియులను
బాసినప్పు డాఁడవారికెల్లఁ
జెప్పు మున్నయట్లు చేతులగాజులు
సరిగ తొడుకుఁదామొ పెద్దవగునో? ౨౭౨

(౫-౫౩)

తే. చుట్టుఁదిరుగును; వగఁగొని సురుగు; మరలు;
చక్కఁబయికెత్తుఁ దొండము సాఁచిచూచు;
బురద దిగఁబడియున్న కుంజరముఁగాంచి,
వలపు సంకెళ్ళచేఁ గట్టువడిన కరిణి. ౨౭౩

(౫-౫౪)

ఆ. నీదు చూపుదారి నిలిచెదు; తిరిగెదుఁ
బ్రక్కలందు; ముందు పరుగులిడెదుఁ
గులుకులాఁడి; చేతియెలదీగతో నిమ్మ
గట్టిదెబ్బ యొకటి! కాఁపుకొడుక! ౨౭౪

(౫-౫౬)

ఆ. గొల్లదొడ్డినడుమఁ గ్రొవ్విన తుంటరి
కోడె వాఁడికొమ్ముఁ గొనల మెల్లఁ
గనులు గోకికొనుచుఁ దనదు సౌభాగ్య సం
పదను జాటుచుండు మొదవుఁగంటె! ౨౭౫

(౫-౬౦)

ఆ. పాదములకు మ్రొక్క బలిమి ముద్దులుగొనఁ
గలుగు పెక్కుసౌఖ్యములను నెల్లఁ
గోలపిల్ల! చెఱుచుకొంటివిగదె వానిఁ
జూచినంత నలుకసుద్ది మఱచి! ౨౭౬

(౫-౬౫)

ఆ. లేడికనుల ముద్దులాండ్! నేటికినింత
యలుక చాలు! మరలనలుగవచ్చు;
నిండు చందమామ నిగ్గులతోడి యీ
రేయి సొగసుచూడు మాయఁదోఁడఁగ. ౨౬౬

(౫-౬౬)

ఆ. కీర్తనైనవారి తేఁకువ దీర్చి క
ష్టించి సేయువార లిరువురిలను;
పార్వతీశుఁడైన పరమేశ్వరుఁడు, రాజ
వల్లభుండు శాలివాహనుండు. ౨౬౭

(౫-౬౭)

ఆ. ఊరికెల్లనున్న దొక్కటియే కదా
పాదిరిచెట్టు రెడ్డివారియింట;
అత్త! దానిపువ్వులు నెత్తిపై మరఁదిగా
రెన్ని ముడుచుకొనుట యేమిబాగు! * ౨౬౮

(౫-౬౮)

---

* రెడ్డివారియింట విటునికి పూవులిచ్చిపంపువా రెవరో యున్నారని వదినెకు సందేహము.

ఆ. పేదరాలు నిజము వేవిళ్ళకాలము
'దేమివలయు'ననుచు నెంద ఱెన్ని
మాఱు లడుగుచున్న 'మంచి నీరే'యను
మగనిఁ గలఁతవెట్ట మనసురాక! ౨౮౦

(గీ - ౭౨)

తే. పొలఁతి! చెప్పెడువారి మాటలకె వలచి
డబ్బులాడెదు గాని, చూడవు నిజంబు
వాని; చూచినయెవ్వతెకైన నిట్టు
నిమ్మళంబుగ సంగముల్ నిలువఁగలవె? ౨౮౧

(గీ—౭౮)

తే. నీకొఱకు వేచి, కన్నులు నిదుర లేక
వాచియుండఁగ, సొగసులు వమ్మగాఁగ,
చిన్నఁబోవుచు వగకాఁడ! చెలులతోడఁ
జెప్పుకొనుటకు నోర్వదా సిగ్గులాఁడి! ౨౮౨

(గీ—౮౨)

ఆ. బ్రదుకు బొంగరంబు వంటిది; విరహాగ్ని
సైఁపరాదు; మేను సన్నగిల్లె;
చెలియ! యింకనేమిగలదు? నీవెఱుఁగుదు
వానితోడఁ జెప్పవలయుమాట! ౨౮౩

(గీ - ౮౬)

క. పెఱతప్పుల కలిగిన నొక
తెఱఁగున నెట్టులైన సరులఁ దేర్పనగుఁ జెలీ;
సరిపడని తప్పుచే ని
త్తెఱిసగ్గిన వాని నెవిధంబునఁ దేర్తురా? ౨౮౪

(౫-౮౮)

ఆ. వచ్చి చూచుచుందు విచ్చకాలాడుదు;
వింతె మంచితనము లెమ్మెకాఁడ!
ఎవరి మనసులోన నేముండునో యది
తెఱచిచూపి యెవరు తెలుపఁగలరు? ౨౮౫

(౫-౮౯)

ఆ. వయితుఁజేర విఘ్నమయి పాడువెన్నెల
నీరు గగనసరసి నిండిపోవె!
చెలియ! చంద్రికిరణముల గొట్టముల యూట
లెంత వేచియున్న నెండిపోవు! ౨౮౬

(౫-౯౦)

ఆ. ఊరఁ గొడుకులేకయుండఁగఁ గోడలు
వచ్చి కాళ్ళమ్రొక్క వంగినపుడు
గాజులెల్ల జారఁగాఁ జూచి కడుఁగోప
కత్తెయయ్యె, నేఁడ్చె నత్తగారు. ౨౮౭

(౫-౯౧)

తే. మలయ మారుత సౌరభములకు నోర్వ
వనుచు నన్నిల్లు వెడలనీద త్తగారు;
పెరటి యూడుగు పూవుల పరిమళంబు
గొట్టుకొని వచ్చినను జచ్చినట్టుగాదొ! ౨౮౮

(౫–౯౮)

ఆ. వనితమొగముచూచుచును వాఁడు, వాని మొ
గంబు నొడలుమఱచి కనుచు నదియు,
ధన్యులైరి మనుచుఁదలఁచెద, రాల్మగ
లొరులు పుడమిలేక యున్నయట్లు. ౨౮౯

(౫–౯౯)

ఆ. వీడుకొన్నవేళ వెలవెలనైన యి
ల్లాలి మొగము చూచినట్టులెల్ల
బందెగాళ్ళువడఁగఁ బయనంపుమాటయే
తలఁపనేరఁడయ్యె దారికాఁడు. ౨౯౦

(౫–౧౦౦)

ఆ. సూది గ్రుచ్చుకొన్నచోట రోకటఁ గొట్టు
వారు పాడుజనులు; వీరికొఱకు
ఒక్కయూరనుండియును రెండుకన్నుల
నిండఁ బ్రియునిజూడ నేరనమ్మ! ౨౯౧

(౬–౧)

ఆ. నిన్ను వేఁడుకొందు; నేఁడొక్కపూట న
న్నేడ్చుచుండ నడ్డగింపవలదు!
ప్రియుఁడు రేపు మఱల వెడలినప్పుడు చెలి!
భూమినున్న నేడ్వఁబోను లెమ్ము! ౨౯-౨

(౬-౨)

ఆ. నిన్నుఁ జూచువేడ్క నీసద్దువిని యెన్ని
యడుగులింతి వేగ నరుగుదెంచె,
వెనుక కన్నియడుగులును మోయవలసెను,
నీవు చూపుదాఁటి పోవ, దాని. ౨౯-౩

(౬-౫)

ఆ. బొమల ముడులు మత్సరమును నీనునులేక
యెండినట్టులుండు రెండుకనుల
నతఁడు నన్నుఁజూచు నందఱివలె; నింకఁ
జిక్కిపోక యేమిసేతు నత్త! ౨౯-౪

(౬-౬)

ఆ. ఎప్పుడు మదికిఁ గూర్తు; వెగ్గులు చేయవు;
నిజముగాని, ప్రేమ నిండియుంట
నమ్మకంబులేదు నాకు నీయెడ; ధైర్య
మూఁడువారికేది? యందకాఁడ! ౨౯-౫

(౬-౮)

ఆ. ఇంకనొకటి వచ్చు నిప్పుడో యప్పుడో *
మంకుమనస! దుఃఖమాత్రమునకె
యేలయిట్లు మిడుక? నింతట ముగిసెనే
పరుల సొత్తుకాశపడిన నీకు! ౨౯౬

(౬—౯)

ఆ. సుగుణవంతురాలు, సుందరి, నిజమది;
నేను బనికిరానిదాన నిజము;
కాని యొక్కమాట; దానిబోలఁగలేని
వారలెల్లఁ జావవలయునేమి? ౨౯౭

(౬—౧౧)

ఆ. కలిమి లేమియును సుఖంబును దుఃఖంబు
దెలిసినడచి, యిల్లుదీర్పఁగల్గు
వారె సతులు; లాఁతివారలు భర్తల
కంటియుండు ముప్పులంతె, కొడుక! ౨౯౮

(౬—౧౨)

---

* మరణమని భావము.

౧. ఇంకి నొకటి వచ్చు నిప్పుడో యప్పుడో *
వంకుమనస! దుఃఖమానేమియున ౽
యేలయిట్లు మిడుక? నింతేల ముఁగిసెనే
పరుల సొత్తుకాశపడిన సేకు! తి. ౬

(౬-౯)

౨. సుగుణవంతురాలు, సుందరి, నిజమది;
నేను జనికిరానిదాన నిజము:
కాని యొక్క మాట; దానిబోలఁగ లేని
వారలెల్లఁ జావవలయునేమి? తి.

(౬-౧౧)

౩. కలిమి లేమియును సుఖంబును దుఃఖంబు
దెలిసినడచి, యిల్లుదిద్దఁగల్గ
వారె సతులు; లాఁతివారలు భర్తల
కంటియుండు ముప్పులంతె, కొడుక! తి. ౮

(౬-౧౨)

---

* మరణమని భావము.

తే. అలంతి నగవుల చీవాట్లు; హద్దుమీఱి
పలుకు నపచారములె మదిఁగలఁచు పనులు;
కంటఁబడి వెట్టికొనుటయె కలహవిధము;
లరయ నిట్టిది మంచి యిల్లాండ్రి నడత. ౨౯౯

(౬–౧౩)

ఆ. జనవిరుద్ధమైన పనిగాన వానితో
మాటలాడకున్న మానెఁగాని;
యెదురు పడినవాని నెట్టిశత్రువైన
నెవరు చూడకుండ నేఁగఁగలరు? ౩౦౦

(౬–౧౪)

ఆ. పేదవాఁడు గూడఁ బ్రియురాలు కైవసం
జేని ధనికునట్లె యెంచుఁ దన్ను;
ఉర్వియెల్లఁ జేతనున్నను బ్రియురాలు
లేనివాఁడు తలఁప లేనివాఁడె! ౩౦౧

(౬–౧౫)

క. ఆయూరి సొగసు, నామా
ప్రాయము, నావయసుమగల వైభవముఁ గధా
ప్రాయముగఁ జెప్పుకొందురు చె
లీ! యందఱు; మేము నాలకించెద మిచటన్!

(౬–౧౬)

తే. మోవి చెక్కిళ్ళు కన్నీట మునిఁగి యుదరు
చుండ వెడనవ్వు నవ్వుచు నువిద పలికెఁ:
'ఇఁకను నీపయిఁ గోపింపనేల? బాస
చేసి యొప్పించుగతికి వచ్చినది ప్రేమ!' ౩౦౩

(౬-౧౮)

ఆ. వన్నెనేయి పూసికొన్న నా మోమును*
గూడఁదమిని ముద్దులాడుఁ దొలుత;
ఇపుడు చూడు! నన్ను నింటిసింగారించు
కొన్నఁ దాఁకుటకును గొంకు వాఁడు! ౩౦౪

(౬-౧౯)

ఆ. సిగ్గు విడిచి, నడత చెడఁగొట్టుకొని, లోక
మెల్ల నపయశంబు నెత్తిచాటి,
యెవనికొఱకుఁ జెలియ! యుర్లితి, వాఁడె నా-
పాలి కన్యుఁడైన వాఁడు నేఁడు! ౩౦౫

(౬-౨౪)

---

* ఆ కాలమున రజస్వలలు గుర్తుగా మొగమున పచ్చగలిపిన నేయి పూసికొనుట దేశాచారమని వ్యాఖ్యాత.

మా. వెంకటేశకవి పు. ౨౨

క. పలువరుసలు దోఁపని న
వ్వులు, ముంగిటికడప దాఁటిపోవని గమనం
బులు, నెమ్మగ మెత్తని మా
డ్కులుఁ బద్ధతులివియసుమ్ము కులవధువులకున్.

(౬—౨౫)

ఆ. "ఇంత సొగసు కేమిహేతువు? నడచెద
నముగుమీఁద నడుగులిడుచు; బంది!"
పెదవులందు నగవు బిగఁబట్టి యదిపల్కెఁ:
"దొంగ! యింతలో నెఱుంగఁగలవు!"* ౩౦౭

(౬—౨౮)

తే. ఎందుఁజూచిన నందెల్ల నెదుట వ్రాసి
పెట్టినట్టుల నీవు కాన్పింతువెపుడు;
ఏమిచెప్పుదు! దిక్కు లందెల్ల నంద
కాఁడ! నీ పటముల వ్రేలఁగట్టినారొ! ౩౦౮

(౬—౩౦)

---

* నాభర్తవచ్చి నన్ను రక్షించి నిన్ను శిక్షించునని భావము.

ఆ. తొలఁగి నిలుచుఁ; గొమ్మమీఁదుఱుకు; గొఱగొఱ
మనుచు గోళ్ళఁజీఱుకు; నదిగొ కోఁతి;
తొలుతఁ గుట్టినట్టి తుమ్మెదయనుచు నే
రేడుపండుఁ దాఁక నోడుఁ జూడు! ౩౦౯

(౬—౩౧)

ఆ. ఆకుపొదలనడుమ నల్లనవ్వేలాడు
దూలగొండిమాకుఁబోలె నున్న
యాఁడకోఁతిచేతి నంటడు మగకోఁతి
దురద దగులుననుచు వెఱచి కంటె! ౩౧౦

(౬—౩౨)

ఆ. పరువులెత్తు జనము, మొరసెడు వాద్యము
లలబలంబుగలిగి, యకట చూడు!
వాఁడొకండు లేమి నేఁడదే పండుగ
కాలుచున్న యూరికరణిఁ దోఁచె. ౩౧౧

(౬—౩౩)

ఆ. పనులు ముగియకుండ మునుమున్నె తెరువరి
యింటి త్రోవఁబట్టి యేఁగఁ జూచి,
కొండమల్లిపువుల నిండునవ్వుల నవ్వెఁ
బోలెఁ గ్రొత్త వానకాల మత్త! ౩౧౨

(౬—౩౪)

ఆ. మీఁదికెక్కి వచ్చు మేఘంబులను జూచి,
బ్రిదుకుమీఁది యాశ వదలుకొనుచు,
కనుల నీరు నించఁగాఁ బాంథునిల్లాలు
చిన్నికొడుకు దెసకుఁ గన్నువఱపె. ౩౧౩

(౬—౩౮)

తే. మొండుకొని మిద్దెబంగలనుండి కురియు
వాననీళులఁ దోఁగిన ప్రాఁతయింట
నానకుండిన వోటును నాన్పుచున్న
దకట! కన్నీళ్ళఁ బాంథునిల్లాలు చూడు. ౩౧౪

(౬—౪౦)

ఆ. మలయ మారుతంబు పొలయదు; మానిసి
కొమ్మలందు మొగ్గ కూడుకొనదు;
కాని, కలఁతగొన్న మానసంబె వసంత
కాలమనుచుఁ దెలుపఁగలుగు సఖి! ౩౧౫

[౬—౪౨)

ఆ. కారణంబు లేక కడునాసతో నిల్లు
తేఁటిగుంపు మావితోఁటలందుఁ
మలయఁజాలదెప్పుడు మగువరో! పొగతీగ
లగ్గిలేక యెట్లులాడఁగలవు? ౩౧౬

(౬—౪౩)

క. దిక్కులు సూచుచుఁ బాడుచు
సొక్కిపడుచు నావులించుచును నిద్రాస్పృక్
గ్రుక్కుచు నేడ్చుచుఁ గుంటుచుఁ
బోకొక్కుడు! నీకేల దాఁపోకలు పథికా? ౩౧౭

(౬—౪౬)

ఆ. అత్త పడినదింట మత్తెక్కి; పతి పొరు
గూరికేగె; కుక్క దోఁపోయె;
పత్రిచేవ విఱుగఁబడె మేసె నెనుబోతు;
దీని నతేని కెవరు తెలుపునాకు? ౩౧౮

(౬—౪౭)

తే. బైటఁగొని పోవె పడకింటి పంజరంబు
లోని గోర్వంక నెచ్చెలికైన, నత్త!
పాడుపలుఁగిది; రేయి మేమాడుకొన్న
చనవుమాటలు చాటించు జనులకెల్ల. ౩౧౯

(౬—౫౭)

ఆ. నిమురు కురులు చూడు! నెత్తావి లేదిఁ
తలని గోమలాంగి పిఱుఁదులంటి,
బంధనంబువలని భయముచే నేడ్చెడిఁ
బోలె, జాఱు నీటిబొట్లఁ జూడు. ౩౨౦

(౬—౫౫)

ఆ. చేట కాలిపోయె; పెనగలు వేఁగలే;
దత్తనారి కింట నలుకపుట్టె;
చూడకుండమునుపె పాఁడేగె; సన్నియు
చెవిటిమొదుటఁ బట్టె సెంకులయ్యె! ౩౨౧

(౬—౫౭)

తే. కన్నెఁగవ విచ్చిచూపులు కదలకుండఁ
బులకరించు చెక్కిళ్ళతో, జలకమాడు
వేళ, నీటమునింగిస ప్రియుల కౌఁగి
లింపుసుఖములఁగంటె! తెల్పెదరు సతులు.

(౬—౫౮)

తే. పగళులంతయుఁ గాఱ్ఱునఁ బఱచు వాన
కాలమందలి క్రొత్తమేఘంబు లుఱుమఁ
గడుముదంబున నెమిళులు మెడలుసాఁచి
చూడునాటలు కనుపండువయ్యెఁ గంటె! ౩౨౩

(౬—౫౯)

ఆ. కొమ్ములోడఁ జిమ్మికొట్టెనఁ బిసపిస
మీఁద కారి, గోటమీఁటినట్టి
పాఁబోలె, గేదెవీఁపున దోమలు
[illegible] నెట్టెఁ గంటె గుంపుగట్టి! ౩౨౪

(౬—౬౦)

తే. తుఱ్ఱుమని మీఁదికెగిరెడుఁ దొఱ్ఱనుండి
గండుఁ జిల్కలవే! శరత్కాలమందు,
జ్వరము దగిలిన మ్రాను నెత్తురును బిత్తి
మొక్కమూఁఱుగఁ గ్రక్కుచు నున్నయట్లు.

(౬—౬౨)

తే. కడిమి పూఁదావి మూర్కొని కనులనీరు
గార్చికొనియెదవేల? యోదార్చికొనుము;
వయసువాఁడవు; పథిక! వెండియును నిల్లు
సేరి నీచెలిమోము దర్శింపవలదె? ౩౭౬

(౭-౭౫)

ఆ. ఇనుపగుండెవాఁడ నేను; నామీఁదనే
యుఱుముకొనుము సత్తువున్నయంత!
కాని, వ్రేలుకురులదాని సనాథ నా
చెలిని జంపవలదు, జలధరంబ! ౩౭౮

(౭-౭౭)

తే. సాంధ్యరాగంబులోపలి చంద్రరేఖ
నెలమొదలినాఁడు కనులఁదన్పెడిని గంటె,
వలిప చెంగావిపైఁటలోపలఁ జెలంగు
క్రొత్త మగనాలి గుబ్బ గోరొత్తువోలె. ౩౭౯

(౬—౬౯)

ఆ. ఆకసంబువంక నక్షత్రల చూచెద
వోయి మఱఁది! నీకు నబ్బుసుపోదు!
ఇంటఁ జూడరాదె యిల్లాలి యెదమీఁద
నర్ధచంద్రరేఖ లన్నియుండ! 3౨౯

(౬—౨౦)

ఆ. వలపుటగ్గి పొగలవలె, లోకమును మరుల్
గొలుపు నెమలియీక కుంచెవోలె,
ప్రాయమునకు సిడెము పగిది-నమ్ముగుడ మో
చెడిని గంటె సురభి చికుర భరము. 3౩౦

(౬—౨౧)

ఆ. చోరజనులు సారెసారెకుఁ జూతురు
భయముఁ గోరికయును బైకొనంగ,
వీరవరుని పత్ని వీఁగుఁ జన్నులఁ, బాము
గాచుకొన్న లిబ్బికడవలట్లు. 33౧

(౬—౨౬)

ఆ. చూడు వింధ్యశిఖరి సొబగు! వర్షర్తుల
తీవ్రపయోధరములు మేను సోఁక,
అన్నికడల మొలచుచున్న లేఁబచ్చిక
సాకుపేరఁ బులకరింపఁ దొడఁగె. 33౨

(౬—౨౨)

ఆ. పెనుమొయిళ్ళగుంపు పనిపూని, పట్టి, రేయిం
డొంటఁ బంతగించి, యుఱిమి, యదిమి,
మూసికొన్న, నేమి మోసమో యెఱుఁగము
గాని, యాకసంబు కాఱుఁదోడఁగె! 333

(౬—౮౦)

ఆ. మగువ! యిట్లు తిరుగమరగిన ప్రియుని సౌ
భాగ్యగరిమ యెంతవట్టు నిలుచు?
వలపుడప్పిఁ జిక్కు చెలులు క్రేఁగంటి చూ
డ్కులను దార్చి పట్టుకొనుచునుండ. 33౪

(౬—౮౧)

ఆ. ఇంటియాలు; కౌఁగిలించుకో; తొలుకోడి
కూయ బెదరి మేలుకొన్నవాఁడ!
ఇరుగు పొరుగువారి యిండ్లంచు నీయింటఁ
గూడ నిట్లు వెఱపుఁ గొనకు సుమ్ము. 33౫

(౬—౮౨)

ఆ. కడిఁదిగాడ్పు వచ్చి మొదఁబట్టి కొండపై
నుండి బలిమిఁద్రోయ నోడలు చిదిగి
చెడిన కాఱుమొగిలు జీవంబువలె, నూఁగు
లాడు గుటుకుగుటుకు మనుచు మెఱుపు. 33౬

(౬—౮3)

ఆ. అత్తో! మొల్లశివయందదియేమి మో
కలదు గొప్పగుణము; తెలియలేము
గాని; తేఁటిబెల్లఁ గన్నులతోడనే
దానిఁ ద్రాగివేయఁ దలఁచుచుండు! ౩౪౧

(౬-౯౧)

క. పూవన్న కెక్కీకాఁతురి
పూవే యగుఁగాని మొదలఁబూవును రూపే!
పూవల్లెవారు వేలుపు
లై పోయిరి దాని తెప్పలార్పక కనుమా! ౩౪౨

(౬-౯౨)

ఆ. అంబురాశిఁ దచ్చి యన్నికష్టములతో
నమృతరసము దేల్చి రమరులెల్ల;
తమకు మిగులఁగూర్పు తరుణుల కెమ్మోవి
రుచియె సాటియౌఁగరో! తలంప. ౩౪౩

(౬-౯౩)

ఆ. చేతికోలఁది నిడిచిన వాఁడియమ్ము మ్రవే
నాయమందు గాయమైన లేడి,
'ఇదియె కూర్పునిత్త తుదిచూపు' టంచును
మొగము దిప్పి చాలఁ బ్రొద్దుసూచె. ౩౪౪

(౬-౯౪)

ఆ. ఎక్కరాని చోట నొక్క మామిడిపండు
వ్రేలుచుండఁ జూచి బిక్షఁ డేడ్వ,
నీదు శత్రుగృహిణి నిలఁబడి వేఁడెను
దారివచ్చి పోవువారి నెల్ల! ౩౪౫

(౬—౯౫)

ఆ. పూవులమ్ముదాని భుజమూల సౌందర్య
దర్శనంబుచేతఁ దనివిసనక,
తరుణవిటుఁడు చుట్టు దిరుగుచున్నాఁడు
చూడు! వట్టి బేరమాడుకొనుచు. ౩౪౬

(౬—౯౮)

ఆ. ఒకటి నొకటి ప్రేమించుటకు వింటికెదురుగాఁ
జొచ్చుచుండు జింకజోడుచూచి,
మనసునొచ్చి, బాష్పమునఁదోఁగు పెనువిల్లు
వేఁటకాఁడు జారవిడిచె నపుడు. ౩౪౭

(౭—౧)

ఆ. అందకాఁడ! నిలువుమయ్య; నీకొక్కటె
సుద్ది చెప్పవలయు;—వద్దులెమ్మ
కాకయున్న—తనకుఁగాని పోకలఁబోవు
వంచలాత్మ యదియె చావనిమ్మ! ౩౪౮

(౭—౨)

ఆ. అడ్డులేని తిరుగులాటలు నవ్వులా
టలకు నెల్ల మొదలు జలము విడిచి,
వెనుకఁ గోడలు చెడిమునుఁగు సంసారంపుఁ
బెద్దబరువు మీఁదఁ బెట్టుకొనియె. ౩౮౯

(౭-౬)

తే. వానిచెంతకుఁ బోదువుగాని, యారాత్రి
మేల చెలి? చందురుండు పైకెక్కనిమ్ము;
పాలలోఁ బాలుగలిసిన పగిది, నెవఁడు
నీమొగము గుర్తుపట్టు వెన్నెలల నడుమ? ౩౯౦

(౭-౭)

తే. గోధనంబులు విడిచిన గొల్లదొడ్డి
కరణి, ద్రవ్యంబులేని మందిరముపగిది,
వట్టిపోయిన సెలయేటి వాయిపోలె,
దాని మొగమయ్యె నీవు కన్దాఁటి పోవ. ౩౯౧

(౭-౯)

ఆ. సిగ్గులాఁడి కేమిచెప్పుదు? నిను నాఁడు
గన్నయపుడు పుట్టియున్న వలపు,
మనసునందె యడఁగి మాసిపోయెడిని కై
కొనక, పేదవారి కోర్కెఁ బోలె. ౩౯౨

(౭-౧౦)

ఆ. "పుడమి నవతె చిక్కిపోవుచున్న నదెల్ల
నీదుకోసమనుచు నియమమేమి?
నగుచు నడిగెదిట్లు! నామేను వేసవి
నిత్తె" యనుచుఁబల్కె యేర్పె నింతి! ౩౫౩

(౭-౧౧)

తే. నీమదికి నింపుగానివన్నియును జేత
నైనయందాఁకఁ జేయక మానఁగలను;
నేనె నీకింపుగాకుంటినేనిఁ జెప్పు
మదియు నాచేతనున్నదే? యందకాఁడ! ౩౫౪

(౭-౧౫)

ఆ. అవయవముల పనుల నన్నిటి నీ పాడు
సిగ్గు జరుగకుండఁ జేయుఁగాని;
చెవులువినక యడ్డుసేయఁజాలకపోవెఁ
జూడు! పెద్దలున్నచోటఁగూడ! ౩౫౫

(౭-౧౬)

ఆ. ఇక్కె యొంటిదిరుగ నేగుచో లేడి పే
రాసతోడఁ జూచినట్టిచూపె,
మగువమీఁద మిగుల మక్కువగల చెంచు
జేని చేతివిల్లు క్రిందజార్చె. ౩౫౬

(౭-౧౯)

ఆ. చూరునుండి వానసేరు గాఱఁగఁ బల
నడ్డుపెట్టి కొడుకు నాదుకొనెనుఁ
గాని, పాంథగృహిణి, కన్నీటివరదలఁ
దాను దడుపుచుంట కానదకట! ౩౧౮

(౭—౨౧)

తే. పండుగకు దంచుచుండిన పిండియొగిరి
తెల్లఁబాఱిన చనుదోయి తెఱవకదిగొ,
మోము తెలిదమ్మిచాటున గోముదేఱు
కలికిరాయంచ కనవోలెఁ గానవచ్చు. ౩౧౯

(౭—౨౪)

ఆ. ఇంక నెవరినైన నీచెంచుమగవారిఁ
జేరి యడిగిచూడు జింకతోళ్ళు;
ఓయి దారికాఁడ! మాయింటిమగఁడు విక్
వంపఁడెప్పుడు జింకపదువుమీఁద. ౩౨౦

(౭—౨౯)

తే. నాకొడుకు తొల్లి యొక్క-బాణంబుతోడఁ
గొట్టఁగలవాఁడు దొరయేనుఁగులనుగూడ;
అంపమోపులఁ గొనిపోవు నకట యిప్పుడు
చూడుమడవికి; కోడలి చూపుమహిమ! ౩౨౧

(౭—౩౦)

ఆ. వింధ్యగిరికి వలసవెడలెడు మాట లీ
పల్లెలోన నెత్తవలదు; రెడ్డి
కూఁపిరాడుచున్న; దొకవేళ బ్రతికి యీ
పలుకువినినఁ బ్రాణములను వదలు! ౩౬౧

(౭—౩౧)

ఆ. బుద్ధిసెప్ప రెడ్డి పుత్రునిబట్టి, ప్రా
ణములు వదలువేళ, 'నాదు పేరు
సెప్పుకొనుచు సిగ్గుచేటుగాఁ బల్లెలోఁ
బందబ్రదుకు బ్రదుకవలద'టంచు. ౩౬౨

(౭—౩౨)

ఆ. తేనెటీఁగ కాటుచే నాథుపెదవి వా
చినది చూచినంతఁ జెంచుగరిత,
ఈసుచేతఁ బల్కరించినఁ బలుకక
యొండు మ్రానినీడ యండకరిగె. ౩౬౩

(౭—౩౮)

తే. జలజలన పాఱు సెలయేళ్ళ చప్పుడులను,
కడిగినట్లున్న బండలఁ, గడమిపువ్వుల
నిండుదావుల, నర్తించు నెమలి గములఁ
గొండపల్లెలు మనసు నాఁకొలుపు మిగుల. ౩౬౪

(౭—౩౬)

ఆ. చెప్పునప్పుడు మొదలు చేసైనఁ బడిగాదు;
గోవు నేఁడుచూడు! గొల్లవాఁడు
మేపి బుజ్జగించు మెలపునఁ గడవల
కొలఁదిఁ బాలు పిదుకఁగలిగెనా! ౩౬౫

(౭-౩౭)

ఆ. మూరుకొనును, దాఁకు, ముద్దాడు, నెదమీఁద
నిలిపికొనును, మేనఁబులకలెగయు,
తనకుఁగూర్చు మగువ నునుఁజెక్కిలినిఁబోలు
నిప్పపూవు, దానిఁ జేఁగువాఁడు. ౩౬౬

(౭-౩౯)

ఆ. కొండదరిని దగులుకొనియున్న పెనుఁబాము
పొరనుఁజూచి, యదిగొ, కట్టెకొండఁ
జేరి వనగజంబు సెలయేటి నీరంచుఁ
దలఁచి తలను చిత్తు తమపఁ దొడఁగె! ౩౬౭

(౭-౪౦)

తే. వెలగపండ్ల సుగంధము వలచి పాటి
పోయెదవు తేఁటి! తామరపూవు వదలి;
చిత్తరువులోని లక్ష్మినాశించు పాము
రునిపగిదిఁ, దాఁకినప్పుడెఱుంగఁ గలవు. ౩౬౮

(౭-౪౧)

క. ఆయెడనె పుట్టు నెవ్వఁడు,
నాయెడనే నాఁగు, నుద్దిలం దేముగియున్;
ఓయన్న! యొక్కఁడే నా
ప్రియపుమగఁ డంతె పుట్టు పల్లాకు నెల్లన్? ౩౬౯

(౭–౪౮)

క. ఏమాటలు మేమాడుదు
మామాటలె యూరివారు నాడుదు; రవియే
కోమలి! యాతఁడు పల్కిన
నేమో సౌఖ్యంబు మదికి నెచ్చుచునుండున్. ౩౭౦

(౭–౪౯)

ఆ. వలచినట్టి వారిచెలిమి సాధింపఁ డె
ల్లయిన సుఖమునందు నాసయేని;
ఎవరిమదికి నెది రుచించు వారికి దాన
లేదు సుఖముగాని దేది గాని. ౩౭౧

(౭–౫౦)

ఆ. చూచుచుంటిమేని చూపులఁ దన్పును;
తలఁచుకొన్నయపుడు తనుపు మనసు;
చేరి పల్కువేళఁ జెవులఁ దన్పును; నిత్య
దివ్యమూర్తిగాదె ప్రియుజనము! ౩౭౨

(౭–౫౧)

తే. హృదయ ఫలకము మీఁద నేమేమి మనసు
ఆసయని మొనసి కుంచెతో వ్రాసికొనునొ,
నవ్వుచును విధి దానినంతయును బట్టి
తుడిచివైచుచునుండు, బాలుఁడును బోలె. 323

(౨—౫౮)

తే. వాని మాటెత్తఁ బులకలు వొడమె మేన;
కాలి సవ్వడి వినినంతఁ గరఁగె నలుక;
మొగము గన్నంత వడఁకెను; మగుడ! వాఁడు
కౌఁగిలించిన నేమి కాఁగలవో యింక! 324

(౨—౫౯)

ఆ. వాలి బరువుచేత వంగిన లేఁగొమ్మ
కొనలఁ గాళ్ళు కుదురుకొనక జాఱి,
మ్రాఁకులందు నిలుచు, మఱల తెక్కల విద
లించికొనుచుఁ బులుగు లెక్కసేని. 325

(౨—౬౦)

ఆ. తిండి నీరుఁబెట్టి దండిగఁ గుక్కనా
చెడిపె యెంత చనవుచేసికొన్న
నదిగో చూడు! మిండఁ డడుదెర కెదురేగు;
నింటి మగఁడు వచ్చెనేని మొఱుగు! 326

(౨—౬౧)

ఆ. ఉన్నదున్నయట్లు యూరాయఁడకే ముందు
చెక్కి పెట్టినట్లు చిన్నఁదేయు
కొడుకుఁగాంచి, నగఁడు మసిసినప్పటికన్న
మించుగాఁగ నేడ్చెఁ జెంచుతల్లి! ౩౨౭

(౭-౬౩)

తే. సమయమెఱుఁగనివారము మేము; ప్రియుఁడు
పలుతెఱంగుల పెళ్కు బెళ్కులను వలచు;
నేఁడుగలియును లే; దింక వెడలుచుండు
కంటినీళ్ళు నిల్పుకోఁగలము? చెలియ! ౩౨౮

(౭-౬౪)

తే. చిలుక, ముక్కునఁ బొడుచుచోఁ జిట్టి మేన
నిండి యుండెడు మామిడిపండురసము
తోడఁబోవఁగఁ, దేంట్లును గూడిపాఱఁ
దావిచేఁ గన్నుగానక దానివెంట. ౩౨౯

(౭-౬౫)

ఆ. ఇచట నేఁబరుందు; నిచ్చట నత్తగా;
రిచటఁ బరిజనంబు లెఱిఁగికొనుము;
రాత్రి నీకుఁగానరాదు; నాశయ్యపై
తప్పి పడెదవేమొ! దారికాఁడ! ౩౩౦

(౭-౬౭)